శ్రీ రస్తు

శ్రీహయగ్రీవ గురుభ్యోనమః

# శ్రీ రామభక్త చరిత్రము.



ఏతద్గ్రంథము

శ్రీలక్ష్మీపుర నివాసుండును

శ్రీలగుడు వంశ పయః పారావార సుధాక

రుండును నైన

శ్రీకన్నంనాయుని కంకితంబుగ

ఇయ్యది

సుజనవిధేయుండును నాగగోత్రోద్భవుండును

నగు

మాదాను వెంకటస్వామిచే

రచియింపబడి

విశాఖపట్టణము

విజయరామచంద్ర ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపబడినది.

1912.

శ్రీరస్తు.

శ్రీహయగ్రీవ గురుభ్యోనమః॥

# శ్రీరామభక్త చరిత్రము.

ఏతద్గ్రంథము

శ్రీలక్ష్మీపుర నివాసుండును
శ్రీలింగుడు వంశ పయః పారావార సుధాక
రుండును నైన
శ్రీకన్నంనాయుని కంకితంబుగ

ఇయ్యది
సుజనవిధేయుండును నాగగోత్రోద్భవుండును
నగు
మాంధాను వెంకటస్వామిచే
రచియింపబడి

విశాఖపట్టణము
విజయరామచంద్ర ముద్రాక్షరశాలయందు
ముద్రింపించి ప్రచురింపబడినది.

*1912.*

శ్రీరస్తు.

# శ్రీరామభక్త చరిత్రము.

కందం॥ వినాయకస్తవం॥ రేగుప్తి॥

శ్రీశంకర వరపుత్రా। పాశికటముగ బ్రోవుమయ్యా ప్రవిమల తేజా। నీకు నమస్కృతి జేసెద। నాకాధిప వినుత విఘ్న నాథ గణేశా॥

దరువు॥ త్రిపుట తా॥ సావేరి॥

శరణు పార్వతీతనయ గజముఖ। శరణు విఘ్న వినాయక॥ శరణు॥ అంబికహృదయానంద। అమర గణముని సేవిత॥ శ॥ కంబుగళసుత అంబుజాకర తుంబురాధిప సేవిత॥ శ॥ శూలపాణి కపాలధరసుత సుగుణగుణమణి సంయుత॥ శ॥ కాలవైరికుమార గణపతి బాలశశిమౌళి ధర॥ శ॥ ఏకదంతి ప్రియా గజానన శోకహార నరసేవిత॥ శ॥ గాజ్జూరూపము బ్రోజ్జ్వలించగ సాజ్జనావన గణాధిప॥ శ॥ పన్నగా లగుసు కన్ననాయుని చెన్నగా గాంచి ప్రశంసగ॥ శరణు॥

సరస్వతీప్రార్థన॥ గీ॥ భయిరవి॥

తమ్ములమ్మును జేయుచు నిమ్ముమీర। ఘుమ్మటంచును
ఘుమఘుమ గ్రమ్మికొనెడి। చందనాదులు మేనను జెం
దియున్న। బమ్మదేవర భామిని బ్రస్తుతింతు॥

గీతం॥ భయిరవి॥

పరమవేడుక శ్రీరామ భద్రచరిత। సరణి మాదాను
వొకటస్వామిదాసు। కూర్చి రచియించె దీనిని కోర్కె
మీర। జూచి యానంద మొందుడీ సుజనులార॥

పంచపాదసీసం॥ భయిరవి॥

ధరణిమాదాసు శీతన్న సాయునికి నే సూనుండ నిమ్మ
హి షుజనహితుడ। మేలైనయట్టి లక్ష్మీపుర వాసులు ఘన
తకన్న త్యా విఖ్యాతిపరులు। నగుచున్న లగుడు కన్నం
నాయకవర్యా పేర నంకితముగ ప్రీతితోడ। చంపకో
త్పలముఖసమితిచెలగద్విపదాత్మకంబుగ నొక్క దాము
మొనర। నొనగూర్చి సవినయంబున నొసంగితి దీని గను
గొనువారు సత్కరుణతోడ। దీని సౌశీల్యవచనలు దెల
సి మెచ్చు। లిచ్చెదరటంచు నెమ్మది నిచ్చగించి। నాడ గృ
పసేయుడయ్య గుణాఢ్యులార। రసికులార సౌజన్య విప్ర
వగులార॥

కందం॥ భైరవి రాగం॥

శ్రీరామభద్రచరితము। నాదూథిగ వినెదు చదువు వారలు బహుధా! గ్యారోగ్య వైభవములను। దారత దు లమాగెదరు ముదావహాలరన్॥

కందం॥ రేగుప్తి రాగం॥

శ్రీమహితసుగుణధామా। భూమిసుత కుముదసోమ భూపలలామా। రామనుజగదభిరామా। కామారిస్తుత్య నామ కలుషవిరామా॥

కీర్తన॥ అటతాళం॥ భైరవి రాగం॥

పూజశాయరె రఘురాములకు॥ పూ॥ పూజశాయ రెవేగ పొందూగరామునకు తేజాముగామీరు వారి జాక్షునాకు॥ పూ॥ మల్లెలు మొల్లాలు మంచీసంపంగీలు కొల్లలాపుచుమీరు చల్లానితంద్రుడికి॥ పూ॥ పొందూగ మీరు యూమందారథసునాకు యుందూనసుండి యూ నందాముగనువేగ॥ పూ॥ ఆనూథిగా సీరవారమును మదినెంచి సారమైన తులసిదాశాములాతోను॥ పూ॥ అందాగుచేరి గోవిందారాయునాకు సందాడిగాను మం దారపువ్వులతోను॥ పూ॥ మెంతో వేడుకతోను విం

తాగ శ్రీకాంతు చెంతానుజేరి చామంతిపువ్వులతోను॥ పూ॥పన్నాగశయనుని మన్ననతో మాత అన్నలార గన్నేరుపువ్వులతోను॥ పూ॥ కరుణతోను లగుడు కన్నంనాయునకుసిరులిచ్చి బ్రోచేటి శ్రీరంగధామునకు॥ పూజశాయరె॥

కందం॥ రేగుప్తిరాగం॥

ఘృతయుతమై దనరుచు సద్యృత వితముగ నైన వత్తులమరుచునుండెన్। హతభుగ్యుతమై దనరెను। హితముగ చేకొనుము దీప మిదుగో దేవా॥

కందం రేగుప్తిరాగం॥

ఊదొత్తులు సాంబ్రాణియు। నాదిగయాఘ్రాణికంబు లన్నియు నిదుగో। వేదికపై వెలుగొందును। సాదరమున సార్వభౌమ చేకొనుమయ్యా॥

కీర్తన ఆహిరిరాగం.

నైవేద్యం బారగించుమూ సీతరామ నామనవాల కించుమూ। చలిమిడివడపప్పు చెలగూను చేకొనుము। నలిననేత్రనిన్నే నమ్మియుంటినిస్వామి॥ నై॥ నారాయణయీూదె నారికేళంబూలు। ఆరగించీమమ్మ నాదరిం

చుము దేవ॥ నై॥ కొమ్మరటిపండ్లు నీకిమ్ముతో డుతవేగ। స
మ్మతిగా చేకొమ్ము రామచంద్ర॥ నై॥ కమలాఫలంబూ
లు కర్జూరమును వేగ। అమరవందితనీవు యారగించుము
దేవ॥ నై॥ నీలమేఘశ్యామ నీకునర్పించేద। పాలగుండ
యు తేనె పానకంబులు వేగ॥ నై॥ శంఖచక్రాధార శర
ణంటి నీకూనె। పంకాజలోచన పరమదయాకర॥ నై॥
కరుణించిమా లగుడు కన్నన్నాయునివేగ। వరములో
సగిబ్రోవు వాసుదేవనేను॥ నై॥

మత్తేభం ముఖారిరాగం.

కరయుగ్మంబును మోడ్చి శ్రీహరి కళాయుక్తంబులౌ
పాదముల్। శిరమున్ జేర్చి ముదంబునన్ స్మృతుల శా
స్త్రార్థంబులం బాడుచున్ । కరుణింపందగదే త్వరన్ స
తులకున్ కళ్యాణమీరాదయో। నరసింహ్వా యనివేడె
దన్ హరిని నేనస్మన్నోవాంచకై॥

కీర్తన- అటతాళం-సౌరాష్ట్రరాగం.

దయలేదెందుకునాపై దశరాథరామ। నిర్దయజూడ
యుదినీకు తగునశ్రీరామ॥ ద॥ శరణుజొచ్చిన విభీషణు
బ్రోవలేద। కరిరాజవరద సన్గాపుమంటె వేగ॥ ద॥ జల

జభావాది నిర్జరనూతచరణ। మమ్ము చెలగూచుబ్రోవ్రా ము చక్రధారనేడు॥ ద॥ హయమూలు గజమూలు అడుగలేదునిన్ను। భయముదీర్చుమీవు పట్టాభిరామ వేగ॥ ద॥ యేరసేవలుజేయ వీరరాఘవనేను। సారెసా రెకునిన్ను కోరివేడినగాని॥ ద॥ ఇలను లాగుషువంశ తిలకం కన్నన్నాయు। చెలగూచు బ్రోచీన శ్రీలక్ష్మినా యక॥ దయలేదెందుకు॥

కందం- శేగుప్తిరాగం.

పంకజ దళనేత్రాహరి। శంకర గీర్వాణయోగి స న్నుతచరితా। కింకరుడ నన్నుబ్రోవుము। లంకాధిపవైరి లక్ష్మణానుజరామా॥

కీర్తన- అటతాళం- కాంభోదిరాగం.

నను బ్రోవరరాఘు రామచంద్రవేగ నపరాధినని వేడితి। నన్నుబ్రోవవేర నారాయణనీవు నిన్నునామ్మి యుంటి నీవెనాగతియుంటి॥ నను॥ యెంతోవేడినరావు యింతైనకరుగావు। కాంతుజానక నన్ను కాపాడరావేగ॥ నను॥ సారెసారెకు వేసారి నిన్నేడితి। మేరాగజూచెదా నేరమేమిరతంత్రి॥ నను॥ వాసవార్చిత దేవ వసుదేవతా

నాయ। దోసిలొగ్గినిన్ను ఆశించియుంటినీ॥ దరు॥ కాపాడరా లగుద్ధుకన్ననాయునివేగ। నోపార్ధివేందుర్రెని నొప్పొగవేడేద॥ నను బ్రోవర॥

కందం- రేగుప్తి రాగం.

దండము రఘువంశోత్తమ। దండము శ్రీరామచంద్ర దశరధతనయా। దండముగోవర్ధనధర। దండమునను బ్రోవవయ్యా దయతోడనికన్॥

కీర్తన- అటతాళం- ముఖారిరాగం.

వందానమయ్యా రాఘవరామ॥ వం॥ వందానమయ్యారెూ వారిజదళ నేత్ర। మందార గిరిధార మము బ్రోవరవేగ॥ వం॥ నందకుమార యానందాముగా మీామ। పొంద్రైన పాదార విందాములకునాదు॥ వం॥ పుండారీకాక్షునీ యండజేరితినేను। పాండావులనుబ్రోచె దండీదొరవృనీకే॥ వం॥ రక్షించమనియెంతొ దీక్షాలు వేడితి। దక్షాతజూడవు పక్షీరాడ్వాహాన॥ వం॥ సుందారిమాపదాసు లందారిలోనన్ను। ముందూగగావూమొ మురళిగానప్రీయా॥ వం॥ కరుణతోడను లగుదు కన్నానాయునిగామ। కారుణ్యారసయుక్తకమలామానోహార॥ వందానమయ్యా॥

సీసం- హిందుస్తాని భైరవిరాగం.

జలనిధిగంభీర జాంబూనదాంబర కాంచనగిరిధర క లుషదూర। నిఖిలలోకాధార నీలాంబుధరవర్ణ కోమ లవరరఘు కులవరేణ్యా। సనకసనందన సన్మునిచారిత్ర పానీయసంభవ పత్రనేత్ర। శకునిరాడ్వరపత్ర శంకరను తిపాత్ర వరమానిమానస వనజమిత్ర। విశ్వభావననిర్గు ణ విశ్వరూప। విశ్వభక్తజనోద్ధర్త విశ్వనాథ। పాహి మాంయంచు వేడెద పరమపురుష॥

కీర్తన- అటతాళం- భయిరవిరాగం.

రారకోదండ శ్రీరామనినువేడేద రక్షించుసమయా మిదెర। రార నిన్నోడీన మేరాగజూచెదా భారాముని దాని కోరివేడితినిన్ను॥ రార॥ ఆక్షౌణమున హిరణ్యా క్షునివధించీన। పక్షివాహన శ్రీలక్ష్మినాయక వేగ॥ రా॥ మందార గిరిదార వందీతసనకాస। నందానర్చిత గో వింద ముకుంద వేగరా॥ యెంతోవేడినరావు యిందీవద ళనేత్ర। పంతమేలరనాపై కాంతాజానకయిాటు॥ రా॥ అన్నరార లగుడు కన్ననాయుని బోవి।పన్నాగశయన యాపన్నరక్షక వేగ॥ రారకో॥

కందం- రేగుప్తి రాగం.

యేరనిను వేడిననో। నారాయణ పలుకవేర నరహరిశౌరీ। కోరిభజించితినిప్పుడు। సారెకు ననుబ్రోవుమయ్యా సారసనేత్రా॥

కీర్తన- ఏకతాళం.

కన్నతండ్రిరార కాపాడవేగ నన్నన్నతండ్రి। నిన్ను వేడెదార నీరాజ్యైయూన వేగ॥ క॥ పన్నగేంద్రశైన పలుమారు వేడితి। వెన్నుడ యిటురార మావేణుగోపాలబాల॥ క॥ యిలలోనబలకలూని ద్రుంచీనవాడ। కలలోననైన పాలూవరించీతివేగ॥ క॥ పెద్దవాడవానీవద్ద నేజేరితి। గస్తారితనమేల వస్తూరబాధావతార॥ క॥ రామయాని నిన్ను వేమారు వేడెన। మోమైనజూపినా ప్రేమదీర్చవేర॥ క॥ చెన్నాగనీచెంత చేరియున్నవాడ। అన్నబ్రోవవేర ఆపన్నవరద వసుదేవతనయ॥ క॥ స్వామిరార లగుడు కన్నాయునిందు। కామితార్థమిచ్చి కరుణించు కౌశల్యపుత్ర॥ కన్నతండ్రిరార॥

కందం- రేగుప్తి రాగం.

రారారఘుకులనాయక। రారాక్షీరాబ్ధిశైన రణజ

యసూరా। కోరితి నిను మదిమరువక। కారుణ్యము తోడబ్రోవు కమలదలాంక్షా॥

కీర్తన- రూపక తాళం.

నారాయణనీ నామమేజీవనామృ। క్షీరాబ్ధిశైనూడావా శ్రీవేణుగోపాల శ్రీమన్॥ నారా॥ కరిరాజుమకరిచేత గాసిజెంది మొరలిడవిని। సరగూనమకరీనిద్రృంచి సామజమునుబ్రోచీన శ్రీమన్॥ నారా॥కాలవశముచేతతోన జామిాలుడు తనసుతునిబిలువ। కాలకింకరులానుబొట్టి। గర్వమడచినట్టి శ్రీమన్॥ నారా॥ మానముగల్రపతికవ మానమురానమయుమునను। శ్రీనాథయనిబిలచిన చీరెలొసగిబ్రోచిన శ్రీమన్॥ నారా॥ కన్నతండ్రివి వెలగుడు కన్నన్నాయునేలుకరణి। వెన్నుడయిటువాచ్చివేగి। పన్నూగాను భాగ్యమొదవు॥ నారా॥

కందం- రేగుప్తిరాగం.

మాందరగిరిధరనినునే। పొందుగనాశించియుంటి బ్రోవుమునన్నున్। ముందునిను భజించితి ఆ। నందముగా నన్నుబ్రోవు మిందిరరమణా॥

కీర్తన- ఆదితాళం- కేదారిగౌళ.

భగవద్భజనకు సమమగు భాగ్యం జగములలేదును

మి॥ భగవద్భక్తుల కన్న మహాోగ్రవి భక్తులు లేరుసుమీ॥ భ॥ హరిపదభక్తుల వంటి బాంధవులు ధరణిలో లేరుసుమి॥ హరిచారిత్రము కన్న మధుర మీధరణిని లేదుసుమి॥ భ॥ రక్షణచేయు శ్రీయః పతికన్నను। రక్షకు లెవరును లేరుసుమి॥ భ॥ దీక్షతో దాసుల దక్షతిగాచెటి దీక్షితుడును నింకెవరుసుమి। అక్షయముగ రక్షించెమనలను। పక్షివాహనుండొకడె సుమి॥ భ॥ కాపాడును సాహత్యగుణతో లగు। కన్నన్నాయుని బ్రోచునుమి॥ భ॥ ఆపరమేశుడు హరి్నశమునుమన। అభిమతమును నొనగూర్చుసుమి॥ భ॥

కందం- రేగుప్తిరాగం.

శ్రీహరిమాదైవంబును। శ్రీహరియును మాకుతండ్రి శ్రీ మాతల్లిన్। శ్రీహరిని నేను వేడెద। శ్రీహరిమె మాకునిచ్చు సిరిసంపదలన్॥

కీర్తన- అటతాళం- సావేరిరాగం.

కరుణజూడుము దేవదేవ। శ్రీకరకోటిసూర్య సామాభమో దేవ॥ క॥ మురహారిసీభజన మరువాక జేసేద। అరవిందలోచాన అమరవందితరామ॥ క॥ అరమరలేక న

న్నాదరించుము దేవ। కరిరాజవరద నన్గావుమంటినయ్యా॥ క॥ మంచివాడవాని మరిమారి వేడితి। సంచితములు బాపి సరగూనదయజూడు॥ క॥ పరమదయాకార పతిత పావనరామ। కరుణజూడుమునన్ను ఖగరాజవాహన॥క॥ లక్ష్మినాయకనిన్ను దీక్షతో వేడిన। తక్షయాలను శ్రీల క్ష్మీపురనాద॥ క॥ వరదలాగుడువంశ వర్యకన్ననాయుని। రక్షించు శ్రీలక్ష్మినాయకదేవ॥ కరుణ॥

సీసం- నాటకురంజి రాగం.

కరుణజూడుమనంటి కాపాడుమనియంటి। వరములొసగమంటి శరదినిమగ। ప్రహ్లాదుర్రీతి నన్నావించుమనియంటి। యలకుచేలునివలె దలచుమంటి। కలనైననిన్ను నే గొలచెడననియంటి। కమలనేత్రానన్ను గావుమంటి। సకలమనోభీష్టి సంప్రాప్తిగావించి। సరగునసఘముల స మయజేయు। బహువిధంబులనుతిజేతు పార్థివేంద్ర। విహగరాడ్వాహనానన్ను వేగగాచి। నాదరంబున గావు మానీదుపాద। భక్తుడను వేగదయజూడు పరమపురుష॥

కీర్తన- యేకతాళం- సావేరిరాగం.

దయనుజూడవేర శ్రీదయతగుణవిహార। దయజూడు

నీవాడనన్ను నీవు కాపాడ॥ ద॥ వుదధిరాడ్గభీర శ్రీయో గిహృద్విహార। మదన మదన ఘోరకదన నిన్నె వేడెద జనార్దన॥ ద॥ కమలదళసునేత్ర శ్రీకామినికళత్ర। యే మంటి శరణంటి యెలమిగావుమంటి॥ ద॥ పరమపావన నామ మముపాలించు శ్రీరంగధామ। నిరతాముమరువా ము నీదుచరితాము॥ ద॥ అమరశేవితాంగ శ్రీరమ మనోజ్ఞభృంగ। విమలచరిత యమలహృదయ కమలనే త్రగావుమో॥ ద॥ విహాగరాత్తురంగా శేషాహిశయన రంగ। కరుణించు వహించు పాపములుఁదొలగించు॥ ద॥ వెన్నుడరావేల లగుడుకన్ననాయకపాల। సన్నుతామ ర యోగీవర ద్వన్నుతనను గావవేర॥

## గీతం- యిందుస్తాని భయిరవిరాగం.

యెంతవేడినదయరాదు యేమిసేతు। పంతమో లేక నీదుసామంతమొకొ్కా। మంతనంబున వేడెద మారజనక। చింతలెడబాపి బ్రోవుము శ్రీరమేశ॥

## కీర్తన- జుల్వాతాళం- భయిరవిరాగం.

రారరాఘువంశసోమ యిటు రారజగాదాభిరామ। రమ్ముభక్తులనేలుకొమ్ము నీవాడనంటిసుమ్ము చేకొమ్ము వ

రమిమ్ము॥ రార॥ కంటి నీదుచేరి త్రవింటి బ్రోచెద వాను
కొంటి నీవంటి నమ్ముంటి యిటు ॥రార॥ యిందురక్షాని
మనసందు నెంతాని వేమరుందు నమ్ముందు రమ్మందు యి
టు॥ రార॥ యేల రావేలజాలమేల। ననుబ్రోవరావదేల
పరిపాల గోపాల యిటు॥ రార॥ నన్ను పోషించమాని
నిన్ను। వేడేదనేనుమున్ను మది నిన్ను దలతూను యి
టు॥ రార॥ యీశా శ్రీలక్ష్మీపురవాస। కన్ననాయకపో
ష పరిపోష మనీష॥ రార॥

కందం- రేగుప్తిరాగం.

శ్రీకరసన్ముని సేవిత। పాకారి ప్రముఖవినుత భవ్యచరి
త్ర। నీకు నమస్కృతిజేసెద। సాకేతపురీనివాస సరగున
బ్రోవన్॥

కీర్తన- ఆదితాళం- ముఖారిరాగం.

రామకరుణించర పరందామ। శ్రీరఘురామ॥ రా॥
రామరామయని వేమరువేడిన। ప్రేమదీర నీమోమైన
జూపవు॥ రా॥ యెంతని వేడుదు యేమి సేతునిక। కంతు
జనక నన్ కాపాడమంటిని॥ రా॥ నిరతమునిన్నునె మరు
వక దలచితి। అరమరలేకను సరగునబ్రోవర॥ రా॥ మం

చివాడవాని మెంచినిన్గోలచితి। అంచితమూగ నన్నా
దరించు వేగ॥ రా॥ చిన్నికృష్ణరార కన్ననాయూనిబ్రో
వ। పన్నగ శయునమొ పరమదయాకర॥ రామ॥

గీతం- యిందుస్తాని- భయిరవిరాగం.

కన్నతండ్రివలెనె కాపాడుమనియంటి।పన్నగేంద్రశై
న బ్రోవుమంటి। నిన్ను వేడుకొంటి నీరజలోచన। నన్ను
గావుమంటి నళిననేత్ర॥

కీర్తన- అటతాళం- సావేరిరాగం.

వందానమయ్య శ్రీరామ మాకువరములొసగు సా
ర్వభౌమ॥ వందా॥ వారిజాసనవంద్య కందర్పశతకోటి
సుందారకారయిదె॥ వందా॥ పంతమేలను రామయ్య
నామువంతాలనెడబాపుమయ్య। చింతాలబాపినీచెంత
జేరితిని కాసంతైనవినవునీ మంతానమెట్టిదో॥ వం॥ సర
శిజదళసమనయున మానినస్నాతవరశేషశైన। కరుణిం
చుమయ్య శ్రీకాంతమనోహర పరమపావనభక్త పాలా
నసుభనాము॥ వందా॥ ఘనతారకాంస్త్రాభభూష లగు
దుకన్ననాయకవరపోష యనుదీనమునసీవె। యనిమాది
నప్పితి ఘనమూగనన్నునె కరణిబ్రోచేదావు॥వందా॥

కందం- రేగుప్తి రాగం.

పాంచాలికిసభలోనను। అంచితముగ ధృతరాష్ట్ర ద
వసూరింపన్। వంచన లేకను వస్త్రము। లంచితముగ
బోసివ లేదా కృష్ణా॥

కీర్తన- ఆదితాళం- సావేరి రాగం.

మేలరావూర గోపాలబాల యేమనంటిని। మేల
రావుకరుణాలవాల వేగ జాల మేల శ్రీగోలగోపాలక॥యే॥
అనుదినమూనని న్నె హరిహరి యానిరి। మనవిచేవేడినమ
దనగోపాలయిటు॥ యేల॥ మెప్పుడుమదిలోన తప్పక వే
డితి। తప్పులెంచాకు వేగ యిప్పుడే శ్రీహప్పాతి॥ యే॥
ఘోరకర్మమూలు నేరక జేసితి। నేరము లెంచ బాహ్యనారా
యణయిటు॥ యే॥ యిందురావేలార నందకుమారక।
మందరగిరిధర సుందారకార యిటు॥ యే॥ శంఖచక్రా
ధారశరణని వేడితి। పంకజలోచాన పాపసమ్హారాణ॥ యే
మెంతో వేడుకుంటి కాంతుజనకని న్నె। సంతసమూనని
సుమంతైన దయ రాదు॥ యే॥ కరుణించర లగుడు కన్న
నాయు నిపైని కరిరాజవారద కాపుమంటిని యిటు॥ యే॥

కందం- రేగుప్తి రాగం.

నారాయణని నమ్మితి। నేరములనుదోలవేర నారద లోలా। నిరతము సేవలు జేసెద। పరమాత్మా మాకు నిమ్ము పరమపదవులన్॥

కీర్తన- రూపకం- సావేరిరాగం.

నామొర వినవేమిర నమ్మితినను గావర వో దేవర॥ నామొ॥ నెనరునకనికరమున బెనగొనమనవినివినుమును। జనంబులన్ మనంబులన్ గనుంగొనన్ గనంబులన్॥ నామొ॥ కరిమకరిచె నురవడిబడి పోరతెరగుల మొరలిడగ కరంబులన్ ధరించి మకరంబు లాన్నరింపగ॥ నామొ॥ అలలననుఖలులలవడి బలమానముదొరనిలగ। ధరించినన్ శైలంగునన్ బలాంబులన్ పలాంబులిమ్ము॥ నామొ॥ బిరబిరనను గావర దేవరవరచరణంబులు స్మరియింతును శరణంటిని మొరబెడితిని కరుణించుము॥ నామొ॥ వినుము నిన్నుమున్ను లగుము కన్నానాయునేలు యూ। పన్నవరద నిన్నె వేడెద అన్నరాగదె కన్నతండ్రి॥ నామొ॥

కందం- రేగుప్తి రాగం.

కాయమునిరమునినను। మాయను విడబాయు

లేక మంచిదె యనుచున్। తోయజనేత్రునిఁ దలపక। పో
యిరి యనుకూపమునకు మాయకుఁ లెల్లన్॥

కృష్ణలీలా- అటతాళం- సావేరిరాగం.

యేరకృష్ణరావేమిర యేంటోపగదానానుర॥ యే॥
రారనీకుబ్రెము కెందను అరడీటుచేయూకుర। బారిదీసి
కౌగిటను చేరదీనుకోర స్వామి॥ యే॥ ముద్దులయ్య నీ
పేదవి ముద్దెట్టనుబుద్దున్నది। వద్దకైనరారయిక ప్రొద్దు
పోయెరస్వామి॥ యే॥ సుందారుడవనినిన్ను జూచి పొం
దుటకుమనసైనది। సంచాడిగవచ్చినాతో పొందుసల్పా
రస్వామి॥ యే॥ నందసుత నావిభుడు మందంగోకిపోయు
న్నాడు సంసైనది రారాయిక మంచాలించికోరస్వామి॥
యే॥ యేలరావ్వారచాలజాల మేలజేసేదా। లేలాయేను
రారవేణుగోపాలబాలస్వామి॥ యే॥ వెన్నాడరార ల
గుడుకన్నాయసేలూవాడ। నన్ను తామారపోవ చి
న్నా కేశవరాయ॥ యే॥

కందం- కేగుళ్ళరాగం.

రామా రామాయనుచును। పామునుడను పిలువగానె
పలుకవదేంగా। తామసమేలను నాపై। ప్రేమను నను
బ్రోవుమయ్య ప్రవిమల చరా॥

## కృష్ణలీలా- అటతాళం- కాంబోదిరాగం.

పిల్లాతల్లినిరాకృష్ణయ్య అల్లపనులునా వల్లగానయ్య యిల్లువల్లుచాల యింగూవకంపాయె నాతో చల్లాటలా దేవు వల్లాగామునితో। తెల్లవుల్లిరసంబుపిప్పలి తగన కాయములిచ్చుసమయము। మెల్లమెల్ల గజరుగుచున్న ది వల్లగాదదిగనుముకృష్ణ॥ పిల్లా॥ పాలింక్షానిండాపా లుండూ గోపాలకట్టితె నసకేకురాడు। తాళిమిచుంచకాకె లదాటినదాకాను। జోలీమానుటయెంతో మేలగును ద లచ। పిలుగానిప్రయోజనములకు। కాలుదువ్వినకార్య మగున। బాలతినమూ వెఱ్ఱియూ మగనాలినీదయ నేలు స్వామి॥ పిల్ల॥ పంటినున్న దాన్నగాను ప్రక్క చంటిపిల్ల దుండుండగాను। కంటగించి పూరి యింటిలోకి మీా పం టివారువచ్చేరంటెనన్వారుజనులు। దంటనై కలుమాను మిక మాయింటిమగవారిచటనుండె బంటువలుకులు నలుగుచును పడకింటిద్వారము దాటనియరు॥ పిల్లా॥ ఇల్లాగిశాయూకునన్నూ వేగ నల్లానినాస్వామి నీను గొల్లభామనునాతో కొల్లగాడకుమీావు యెల్లాజనులు వినిన నల్లారినచ్చును। కల్ల గాదదివినుము లగుడు కన్న

నాయునిబ్రోవుమటకునటు మెల్లగనుజనుమయ్యకృష్ణ మే
లుగల్గునునీకు మొక్కెద॥ పిల్లా॥

కందం- రేగుప్తి రాగం.

నరహరినామొరవినియును। సరగుననను బ్రోవనేర
సారసనేత్రా। కోరితినామదినిప్పుడు। స్థిరముగవనుబ్రో
వుమయ్యా శీతారామా॥

కృష్ణలీలా- అటతాళం- కళ్యాణిరాగం.

రమ్మనినేబిలచెద రారముద్దూల కృష్ణ। క్రమ్మనవేగ
మున కోర్కెదీర్చారవేగ॥ ర॥ అతిసుందరుడవని ఆశిం
చినేయుంటిని। పతిఆశలన్నిదీసి బాసలాడేదవేర॥ ర॥
చక్కానిస్వామి నుక్కువదీర్చావేమి। పుక్కిటవిడెమి
చ్చి పొందూగరతినాయ॥ ర॥ ముదముతోనారావికె
ము కివదలించవేగ। సదయుడనాతో రతి శాయగోరితి
నిను॥ ర॥ కమ్మని మోవిచ్చి కామించరారవేగ। కాము
కేళీలోగూడి కలిసుఖించుయుటు॥ ర॥ మిగులసంతోష
ముతో లగుదుకన్న నాయుని। అగణితముగ బ్రోచునట్టి
వేణుగోపాల॥ ర॥

గీతం- భయిరవిరాగం.

కరుణజూపుమయ్యా కంసారివేగమే। వరములొసగు

మయ్యా పరమపురుష। తరమెనిన్ను బొగడ దాసాన దా
సుండ। దైవరాయ వేగబ్రోవవయ్యా॥

జావళీ- జుల్వతాళం- యిందుస్తాని భయిరవిరాగం.

నిన్నె నమ్మియుంటిరగోపాల నేరమేమిదెల్పర॥నిన్నె॥
పన్నగశైనా విన్నపమాలించి। మన్ననబ్రోవవేర॥
నిన్నె॥ వెన్నాడనీవు యీవెలదూలాతోగూడి। చిన్నె
లునూనార చిన్ని కేశవరాయ॥ నిన్నె॥ మందూలమా
రెవతో మందుపెట్టిన దేమొ। మందువల్లనుమాది సం
దేహమేలార॥ నిన్నె॥ సరిసూడవనినిన్ను చాలానమ్మి
యుంటి। సరిగూనరావేర జాలమేలరస్వామి॥ నిన్నె॥
గోపాలనిన్నెనె గోరితినేచాల। నీపాలజేరితి నన్నేల
వేలారస్వామి॥ నిన్నె॥ వగలేలజేసేదా వయ్యారినాస్వా
మి। లగుడుకన్ననాయుని నగణీతము గబ్రోవు॥ నిన్నెన॥

జావళీ- ఆదితాళం- కళ్యాణిరాగం.

ఏలార గోపాలా బాల చాలూనికపోపోరా। బా
లామణులాతో గూడి బాసలెన్నో జేసేవూ॥ ఏల॥
నిన్న మొన్నాను అల్ల కన్నెలాతో గూడేవు। వన్నెకాడ
నిన్ను నేను చిన్నికృష్ణ నమ్మూర॥ ఏల॥ బంటుతెనమూ

నను నా వెంట తిరుగబోకూర। తంటురీతనముచేత జం
టజేరరాకూర॥ ఏల॥ యిమ్మున ౹అల దాని సాహసమ్ము
నగూడేవ్వార చాల్ లెమ్మర మీవంటి మగవారినీక న
మ్మార॥ ఏల॥ కరమూల ౹మొక్కెద లగుడు కన్న
న్నాయునేలర మరిమూరినినువేడెదార మదనగోపాల॥
ఏలారగోపాల॥

జావళీ- ఝంప్రతాళం- భయిరవిరాగం.

౹ప్రేమలేదుగాదెచెలియ నాసామికింతనాపై ౹ప్రేమ
లేదుగాదెచెలియ। కోరినవరమూలు నారిమణులకిచ్చి
కోర్కెలోసంగుగోపాలూనికీనాపై॥ ౹ప్రేమ॥ దుష్టులశి
క్షించె దీనులరక్షించె। ఇష్టుడనీకూనె యినకూలచంద్ర
స్వామి॥ ౹ప్రేమ॥ చక్కానినాసామి మక్కూవదీరరా।
ఒక్కనిముషామైన నోర్వాజాలాను॥ ౹ప్రేమ॥ నాసలుబె
ట్టకు మూదాసవెంకటస్వామిని। దూషించినప్పుడు దో
షాములెన్నకుర॥ ౹ప్రేమలేదు॥

కోల్నాలపాట.

సువ్విరామచంద్రసువ్వి। సువ్విరామభద్రసువ్వి। సు
వ్విరామాభిరామ సువ్వాలాలి॥ సు॥ 1 శ్రీరాము డేశభద్ర

చారిత్రజనక రామ। అరిపూరిసీలవర్ణ హరియరాఘవ॥ సు॥ 2 వనిత రామతీర్థపూరి వాసుడయినరాముసీకి। జనకతనయపరిణయంబు ఘనతమీరను॥ సు॥ 3 యల మితోనుమాఘశుద్ధ యేకాదశిమినాడు। జలజసంభవాదిసురులు సలుపదలచిరి॥ సు॥ 4 నాతులార రారె కొట్నమూలుదంతుమిపుడు। గొంతులందరూను నేడు కూడివేగము॥ సు॥ 5 కలికిరావె కప్పురంపు ములికిరావెమరునిచేతి। ములికిరావె కోకిల చిలుక రావె॥ సు॥ 6 కన్నె రావె నీవు రావె కప్పురంపుదిన్నె రావె। వన్నెగున్న చిన్ని పొన్నగున్న రావె। సు॥ 7 బొమ్మరావె బంగారుబొమ్మ రావె। శివునిముద్దుగుమ్మరావేగ మాయమ్మరావె॥సు॥ 8 యింతిరావెగమనవిభవ దంతిరావె మరునిపువ్వు। బంతి రావేగమే కాంతరావె॥ సు॥ 9 పువ్వుబోణినీవు రావె పుష్పమూలు చెత్తుగాని। కీరవాణినీవురావె ధీరతంబున॥ సు॥ 10 సుందరదననీవురావె చందనంబుదీతుగాని। పద్మగంధినీవురావె పాటబాడను॥ సు॥ 11 నలినాయతాక్షిరావె నాయకంబుమీరగాను। తోయజాక్షులారరారె తోపుమీరనూ॥ సు॥ 12 రాముకొట్నమూలుదంచ నమణులంతగూడుకోని। పిలువనంపెరారె వేగ ప్రియ

ముత్తోడను॥ సు॥ 13 సీతకొట్లు మూలుదంచ శీఘ్రమూ
గగూడుకోని। ముస్తాబులౌ తారుముద్దుగుమ్మలూ॥సు॥14
పసుపునూనెలూనుగలిపి బాగుగానునలుగు బెట్టి। వేడ్క
తోను స్నానమాడి వెలదులందరు॥ సు॥ 15 తడివస్త్రి
మూలువిడచి పొడివస్త్రిమూలు గట్టి। పొత్తి బట్టలానుత
అలు నీరువత్త్రిరి॥ 16 వెండిచిక్కా పుకట్ల వెలదులంతబ
ట్టుకోని। తలలువారించిరపుడు తరుణులందరు॥ సు॥ 17
కొప్పునున్న గానుదువ్వి కొమరకాటుకాలు బెట్టి। కొప్పు
పైనిముత్యాలు పేరులుంచిరి॥ సు॥ 18 పెద్దలనాటివైన
పెట్టెలన్ని దీసినారు। అరణభరణమూలుమంచి భూషణం
బులు॥ సు॥ 19 పాపిటచేర్చుక్క బావిళ్లీలుకొప్పుగొలు
సు। లొప్పుగానుంచినారు కిప్పెసవరముల్॥ సు॥ 20
నవరత్న ఖచితమైన నాణ్యమైనభూషణములు। అలంక
రించినారు వేగ అతివలందరు॥ సు॥ 21 గోమేదికములు
మంచి పుష్యరాగంబులూను। మణులుమాణిక్యమూలు
మరకతంబులు॥ సు॥ 22 వజ్రవైడూర్యములు వరుసగా
నుచెక్కినట్టి। రాగిడీలువుంచినారు రాజదేవులు సు॥ 23
మెడలోనువేసినారు మేలైనపతకమూలు। చంద్రహార
మూలు వేసె చెలియలందరు॥ సు॥ 24 పలకసరి పేటలూ

ను కలుకుమీరగుత్తిగంట్లు। బంగారుదండవేసె భామలందరు॥ సు॥ 25 ముక్కునానత్తుకమ్మి మునిచెవ్వాకుం జెల్లు। కానుబావిలీలుమంచి కన్నుజోళ్లుగా॥ సు॥ 26 వన్నెనచేతులాకు వంకీలుకంకణములు। మురుగుజోళ్లు మురిడీలుముదితలందరు॥ సు॥ 27 బాజబందులూనుమంచి బంగారుగాజులూను। చేతులాకుతొడగినారు చెలియలందరు॥ సు॥ 28 మెరుపుతీగెలూనుబోలు మెడనుతీగెలుంచినారు। అంగకాళ్లువ్రేళ్లు భటువు లుంగరంబులూ॥ సు॥ 29 పానుపత్రికాలుమంచి పగడంపు గుత్తిగంట్లు। చంద్రహారమూలువేసె చెలియలందరు॥ సు॥ 30 పాదమూలు మెరయుగాను పావడాలుమట్టెలూను। పొందుగానతొడగినారు పెండిబొందులు॥ సు॥ 31 నడుమువడ్డాణమూలు నాగభందమూలుమంచి। పిగిలికుచ్చులూను రవికె సొంపుగా॥ సు॥ 32 చెంగాయిచీరెలూను చెంగువిరచికట్టినారు। రంగుమీరనట్టి వన్నె రవికెతొడగిరి॥ సు॥ 33 పూదిరెగిరిపోయినట్టి పుట్టమట్లచీరెలును। వన్నెమీరగట్టినారు వనితలందరు॥ సు॥ 34 ధగద్ధగమనియేటి తళుకువన్నెచీరెలూను। కొంగువిరచికట్టినారు కొన్నులందరు॥ సు॥ 34 విలువలేని మొత్తుమంచి సన్నపట్టుచీరెలూ

ను। యెంచివారుకట్టినారు వెలదులందరు॥ సు॥ 36 కు
సుమపువ్వుబంగారు కొంగునేతరవికెలూను। అంగనాలు
తొడగినారు అంతచక్కగ॥ సు॥ 37 వంగపండుచీరెలూ
ను వసుసగానుగట్టినారు। మల్లెమొగ్గచీరెలూను వల్లెవా
టలు॥ సు॥ 38 మెడదిరగపుష్పమూలు మేలుగాను వేసి
నారు। యేసోదపూలదండ వేసిరందరు॥ సు॥ 39 సంపం
గివీరజాజి మంచిమల్లెమొగ్గలూను। కొప్పులోనుసవరి
నారు గొప్పదండలు॥ సు॥ 40 కుంకుమాకస్తూరితిలుక
మూదిద్దినారు। కన్నులాంకుసోగసైన కంటిరేకలు॥ సు॥41
అత్తర్పన్నీరు జవ్వాది బూసినారు। చెక్కిలీనిగంధ
మూలు చెలియలందరూ॥ సు॥ 42 ఆకులూను పోకలూ
ను చేతులానుబట్టినారు। విడియమూలువేసినారు వెలదు
లందరు॥ సు॥ 43 వక్కలాటివాళ్లంతె వనితలంతగూడు
కోని। అక్కలంతజల్లులాడె బుక్కగుండలు॥ సు॥ 44 వు
దయగిరిసూర్యకళనున్న తీగానుస్త్రీలు। వారిముస్తాబు
జెప్ప నలవిగాదుగా॥ సు॥ 45 ముస్తాబులైనారు ముందు
దేవతాస్త్రీలు। ధాన్యమూలుపేర్లుజెప్ప తరుణులందరు॥
సు॥ 46 రాజభోగమూలుమంచి రమ్యమైనధాన్యమూ
లు। రాసులఘకమైనట్టి రమణిగిజ్జలూ॥ సు॥ 47 పెద్దమై

పాళీలు పేరైనధాన్యమూలు। కొద్దిమించిపండినట్టి కొం డబుడగలూ॥ సు॥ 48 సన్నవీరజాజులూను మంచిమల్లె ధాన్యమూలు। ఘెక్కువగనుపండినట్టి యేరుపసనలు॥ సు॥ 49 చిట్టిముత్యాలుమించి జిలుగువన్నె ధాన్యమూ లు। మహాదేవుకాటుకాలు మల్లెనన్నాలు॥ సు॥ 50 సత్తి కాలువడ్లుధాన్య సన్నవీగజాజులూను।పొందుగానుపండి నట్టిబొండుమల్లెలు॥సు॥ 51 గరుడవాహనాలుమించి గో రవడ్డాణులు। అవుమైనయెరుపుకాంతిఆకుపచ్చలు॥సు॥52 ఱక్కరాజసన్నాలు ఆవిగుడార్లమేలుమంచి। ముమ్మ గానుపండినట్టి మువ్వవంకలు॥ సు॥ 53 కాంబోజరాజనా లు। ఘనమైనధాన్యమూలు। మెంచినట్టుపండినావి మె ట్టసన్నాలు॥ సు॥ 54 అక్కుళ్ళు జలతార్లు ఆకుసన్నమూ లుమంచి। జిలకర్రభోగమూలు జిలుగుధాన్యము॥ సు॥55 చెరువుక్రిందపండినావి చామంతి ధాన్యమూలు। గట్టు మీాదపండినాయి గౌరుకుంకాలు॥ సు॥ 56 కొండరత్న సరులుమంచి గోడప్రయాగాలు। అంకితముగపండినాయి అధికసన్నాలు॥ సు॥ 57 పచ్చగాను పండినట్టి పసుపుకం టిధాన్యమూలు। సూత్రముగను పండినాయిసూర్యరేక లు॥ సు॥ 58 పాలభోగమూలుమంచి నీలవర్న ధాన్య

మూలు। మృదువుగాను పండినాయి ముకుదొండధా న్యము॥ సు॥ 59 శ్రీరామభోగమూలు శీతభోగమూలు మంచి। దండిగానుపండినాయి దసరుభోగాలు॥ సు॥ 60 తలలసుబ్బురాయసరులు తోరమైనబల్లిగుత్తు। లలమెం డిబల్లిగుత్తురాలవడ్లును॥ సు॥ 61 బంగారు తీగెలూను బాగైనరత్నసరులు। గంగజాలార్లుమంచి కాసిసన్నము॥ సు॥ 62 గరుడవాహనాలుమంచి గౌరీసింకాలు। పచ్చ గన్నేర్లులవి మంచిదినుసులు॥ సు॥ 63 సాలూరు సన్నా లు మహారాజభోగమూలు। అలకంటిధాన్యమూలు అ ధికసన్నము॥ సు॥ 64 సులకనమైపాళి సువర్ణ రేకలూ ను। బాగుగానుపండె బలరాముభోగాలు॥ సు॥ 65 మృ దువుగానుపండినాయి మురుదొండసత్రికాలు। వులవచి త్తెళ్లు మొదలు వ్రూదసన్నాలు॥సు॥66 పొందుగానుపండి నట్టి బోబిలికంబుధాన్యమూలు। మేలుగానుపండినాయి మెట్టుబుడగలు॥ సు॥ 67 నవకోటిధాన్యమూలు నారా యణునికి వేగ। కొట్నమూలు బోసినారు గొంతులంద రు॥ సు॥ 68 సరస్వతి పార్వతి సఖియపాతాళగంగ। పే రంటాళ్లపుడు వేగ పిలువనంపిరి॥ సు॥ 69 పెద్దలందరూ నుగూడి పెళ్లిదాగరూలు దచ్చి। పీనపైనుంచినారు ప్రి

యముతోడను॥ సు॥ 70 కలికిరావె కొలికిరావె చిలుక
రావె ములికిరావె। వజ్రాలవంటివలుకు వనితరావె॥
సు॥ 71 యింతిరావె గుజ్జంగి బంతిరావె రత్నాల। బం
తిరావె మదనుచామంతిరావె॥ సు॥ 72 పచ్చకస్తూరిరా
వె పస్నిటకుప్పరావె। పచ్చవిల్తురేఖపలుకు పణతిరావె॥
సు॥ 73 చేడెరావె చెలియరావె పొన్నరావె గున్న
రావె। వెలదిరావె కొట్నమూలు వేగదంతుము॥సు॥ 74
సామిదరో కళ్లు సుదతుంత బట్టుకోని। పారరో కళ్లుబట్టి భా
మలందరు॥ సు॥ 75 కంకణంబులూనుగట్టి ఘనమైనరో
కళ్లు। చేతులానుబట్టినారు చెలియలందరు॥ సు॥ 76 కలి
యగూర్చికరములందు కంకణములు ధ్వనులుచెలగ। రా
ళ్లనందెలూను ఘల్లు ఘల్లు మనగను॥ సు॥ 77 శ్రీరామ
చంద్రునికి కొట్నమూలుబోసినారు। సువ్వి సువ్వి యను
చు నంచె సుదతులందరు॥ సు॥ 78 దేవరాజైశ్వర్యమూ
న దేనుడింట వైభవంబు। శ్రీరాములారు పెండ్లి శాయ
దలచిరి॥ సు॥ 79 పంకజాక్షులంతగూడి పొంకమూగపా
డినారు। పొలతులందరూను గూడి పొలువుమీరను॥
సు॥ 80 సిరజాక్షులంతగూడి నిజముగాను పాడినారు। వె
లతలందరూనుగూడి నేర్పుమీరను॥ సు॥ 81 కోటిరు

జ్ఞమూలుతపను కోటిగానుశాయగాను। దశరథింటబు
ట్టినావు రాఘవేశ్వరా॥ సు॥ 82 కౌంశల్యగర్భమూన
కమలలోచనూడనీవు। జననమైనావుస్వామి జగతిలోప
ల॥ సు॥ 83 బాలప్రాయమూన నీవు బంతులాడుచుండ
గాను। దశరథునిబిలచినాగు తడవుశాయక॥ సు॥ 84 తం
డ్రిదశరదూనిమాట తనయుడంతటాలకించి। ప్రయాణ
మూలుగట్టినారు ప్రియముతోడను॥ సు॥ 85 దనస్సూ
లు అంబులూను చేతులానుబట్టినారు। వేగమూననడచి
నారు వేడ్కమీరను॥ సు॥ 86 లాగుకోకలూనుమంచి
లగువుగానుతొడగినారు నెల్లైరామలక్ష్మణూలు యజ్ఞ
మూలకు॥ సు॥ 87 ఘోరమైనరాక్షసులను వీరులిద్దరూ
నుగూడి। వారికడ్డమూగవచ్చె వన్నెమీరను॥ సు॥ 88
రాక్షసూలమాటలాకు రామచంద్రుడాలకించి। మంట
లెగయతొడగినారు వింటబాణముల్॥ సు॥ 89 మా
టలాడనంతలోన తాటకీని ద్రుంచినారు। రాక్షసులను
జంపినారు రాఘవేశ్వరా॥ సు॥ 90 దీక్షగానుజూచివా
రు రాక్షసూలజంపినారు। వారి వారి ప్రజ్ఞ దెలుప వశ
ముగాదురా॥ సు॥ 91 దేవతూలగూడుకోని దివ్యమూ
గ రామచంద్రు। మునులుయజ్ఞమూలుగాచె ముద్దురా

ఘువా॥ సు॥ 92 ముక్కోటి దేవతూలు సూటిగాను మెచ్చ గాను। హారివిల్లువిరచినావుఅయ్యారాఘువా॥ సు॥ 93 అ ష్టదిక్పాలకూలు నవబ్రహ్మలూను మెచ్చి। యిష్టమూతో కీతనిచ్చె సృష్టిలోపల॥ సు॥ 94 పుడమికృష్ణా దేవు పుర మునందు వెలసియున్న। ఘనతకెక్కినట్టి లగుదు గారు నాయునకు॥ సు॥ 95 నగ్రతనయుడైనట్టి నామదేయ క న్ననాయు। సతనిపేరనంకితంబు యితవుమీరను॥సు॥86 రామభద్రచరితమందు రమ్యమైన కొట్నాల। పాటయొ కటికూర్చిపాడె వాటమూగను॥ సు॥ 97 వాసీగమా దాసు వెంకటస్వామిదాసు। వాశిగారచియించెపాట వ సుధలోపల॥ సు॥ 98 శ్రీరామలక్ష్మణూని అత్మలోనదల చుకోని। ఘనముగాను పాడరెయొ కాంతలందరు॥సు 99॥ కురులునున్నగాను దువ్వి కొప్పు సవరమూలుముడచి। కొప్పులీడదంచినారు గొంతులందరు॥ సువ్విరామచంద్ర సువ్వి। సువ్విరామభద్రసువ్వి। సువ్విరామాభిరామ। సు వ్విలాలి॥ 100 చరణములు పాట॥

మంగళహారతి- ఆదితాళం- సావేరి రాగం.

హారతి గైకొనుమ మంగళ హారతి గైకొనుమ। హా రతిగైకొని సారసాక్షమము ధీరతతోడను పరమహితా

జ ఝు॥ హారతి॥ సారసింహానిను కోరి వేడెదను। హారతు లను మనసారగనొసగుచు॥ హారతి॥ మదనజనకనిను మ దినిస్మరించెద। కదనరంగశూర కౌశలవేగము॥ హారతి॥ లక్ష్మణానుజ లక్ష్మీరమణ। యక్షహరణమో లక్ష్మీపుర నాద॥ హారతి॥ కరుణతోడ నలకన్ననాయునికి। వరము లొసగుము వరదదయాకర॥ హారతి గైకొనుము॥

జోలపాటలు- అట తాళం ఆనందభయిరవి.

జో యచ్యుతానంద జోజో ముకుంద। జో యనంతా నంద జోసదానంద॥ జోజో॥ జోమాధవాస్వామి జో మదన మదన। జో మధూసూదన జో ముకుందాయ॥ జోజో॥ జో కాకుత్స్థ కవ్వంశ జో కమల నేత్ర। పాకశాసన ముఖ్య సురస్తోత్ర పాత్ర॥ జోజో॥ జో చక్రధరవిక్రమోప క్రమాంగా। జో జగత్ప్రభు రామ చంద్రభూపాల॥జోజో॥ లగుమకన్నంనాయునొగి కల్మషొసగి। తగుబ్రోవుమయ్య శీతారామచంద్రా॥ జోజో॥

శ్రీరామభక్త చరిత్రము

సంపూర్ణము.

